హరిశ్చంద్రరావు, గోవిందరాజు

అర్థశాస్త్రచంద్రిక

కాకినాడ, 1922

Record no. 749

Hariścandrarāvu, Gōvindarāju

Ardhaśāstracandrika

Kākināḍa, 1922

Record no. 749

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

హరిశ్చంద్రరావు, గోవిందరాజు.
అర్ధశాస్త్రచంద్రిక : ప్రథమ భాగము / గోవిందరాజు హరిశ్చంద్రరావు. - కాకినాడ: పి. వి. రంగారావు, 1922.

v. <1   > ; 16 cm.

Record no. 749

Hariścandrarāvu, Gōvindarāju.
Ardhaśāstracandrika : prathama bhāgamu / Gōvindarāju Hariścandrarāvu. - Kākināḍa: Pi. Vi. Raṅgārāvu, 1922.

v. <1   > ; 16 cm.

Record no. 749

---

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB    Date filming began:

# అర్థశాస్త్రచంద్రిక.

(ప్రథమభాగము)

గోవిందరాజు హరిసర్వోత్తమరావుచే
రచియింపఁబడినది.







కాకినాడ:

పి. వి. రంగారావుగారి రంగా అండు కో.,
ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి
గ్రంథకర్తచేఁ బ్రకటింపఁబడెను.

1922

 [వెల రు 0-4-0.

# విషయసూచిక.





# అర్థశాస్త్రచంద్రిక.

## ఔషధములు-యంత్రములు

కొందఱు యంత్రముల నౌషధములను జేయుటయందు నుపయోగించుచున్నారు. ఇట్లు చేయుటవలన శాస్త్రకారుల యభిప్రాయమునకు వ్యతిరేకముగా నడచుచున్నారు. ఏలయన, నొక యౌషధ మెన్ని పర్యాయము లేపాత్రలందుఁ బుటశోధనంబు నొందవలెనని వైద్యగ్రంథములందు నియమింపఁబడినదో యటుల జరుగుట లేదు. మట్టితోఁ జేయఁబడిన కుండయందు వండవలసిన యౌషధమును లోహముతోఁ జేయఁబడిన పాత్రయందు వండుటవలన గుణము మాఱుచున్నది. పదిసారులు పుటంబు గావలసినదానికి రెండు పర్యాయములు మాత్రమే చేయుటవలన గుణము భేదించును. ఇట్లు క్రమము నతిక్రమించినయెడల, వాతరాక్షసము వాతరాక్షసము కానేరదు; దానికా పేరు తగదు; ఫలమును వేఱుగా నుండును. ఇట్టి వాతరాక్షసము నుపయోగించిన రోగికిఁ గావలసిన ఫలము రాకున్న, నెవరు నింద్యులు? వైద్యశాస్త్ర మబద్ధమా? యంత్రముల

నాశ్రయించువారు పదార్థముయొక్క పరిమాణ మునే యపేక్షించుచున్నారుగాని గుణము నపేక్షించుటలేదు. ఔషధములను వారు గ్రామాంతరముల కమితముగా నంపి ధనము నార్జింపఁగోరువారు. అలసులగుటవలన వీరు శీఘ్రముగాఁ గార్యమును సాధించుటకే బ్రయత్నింతురు; చెప్పినన్ని మాఱులు పుటశోధనముఁ గావింపఁగలరా? మన పూర్వులు యంత్రముల నెఱుంగని దశయందుండిరి గావున మిక్కిలి ప్రయాసతోఁ గూడిన పద్ధతుల నుపదేశించిరనియు, మనము వారికంటె గొప్పవారముగాన లఘుతరమయిన పద్ధతుల నవలంబింపవలయుననియు, నూతన సంస్కారు లనుచున్నారు; కాని, ప్రాచీనులకుఁగల యోపిక మనకులేదని వీరలొప్పుకొనరు; వారి గుణవివేకమును మనకులేదని వీరంగీకరింపరు. అపేక్షితగుణంబు సిద్ధింపదని తలంచి ప్రాచీనులు పెద్దయంత్రములను గల్పింపలేదు; సామర్థ్యము లేకపోవుటచేతఁగాదు. మఱియు, వైద్యగ్రంథములందుఁ జెప్పఁబడిన పసరులు మున్నగునవియే శుద్ధిచేయుట మొదలైన పనులందు వాడవలెను గాని మన బుదికిఁ దోఁచినవి వాడఁగూడదు.



ఒక వస్తువు లభింపనియెడల దానికిఁ బ్రతినిధిని మన పూర్వులే నిర్ణయించియున్నారు. మనమే యది కల్పింపవలెనన్న, మనకు జ్ఞానాదులు మిక్కిలి తక్కువగా నున్నవిగావున మన మసమర్థులమై యున్నారము. మఱియు, యంత్రసహాయమున నౌషధాదు లమితముగాఁ జేయఁబడునుగాన దానిలోఁ జాలభాగము సేవింపఁబడకయే సంవత్సరములకొలఁది నిలిచి, సేవింపఁబడు నాటికిఁ బూర్తిగాఁ బాడయియుండుటగాని పటుత్వము తగ్గియుండుటగాని సంభవించును.

## — పదార్థవ్యయము —

యంత్రములను నిర్మించుటయందు లోహాదులావశ్యకములు. కావున మానవులకు ముఖ్యములయిన నాగలి మున్నగు వస్తువులకయినను లోహాదులు దుర్లభములగును; వానివెల యధికముగానుండును. మఱియు గనులయందనేకులు శ్రమపడవలసియుండును; వారు నిర్మలమయిన గాలిని సూర్యుని కాంతిని విడిచి లోతుగా భూమిలోదిగి తమజీవితములను హ్రస్వములుగాఁ జేసికొనవలసినవారగుచున్నారు. మఱియు యంత్రములను నడపుటకు బొగ్గుకావలయునుగాన బొగ్గుగనులలో

జనులనేకులు పాటుపడవలసివచ్చును. బొగ్గు లేకున్నఁ గట్టెలైనను వాడవలయును; దానికి వృక్షములు పెక్కులు కూల్చివేయఁబడును; అవి కూలిపోవుటవలన వర్షములు మున్నగువానికి నష్టముకలుగును. మఱియు, వంట మొదలయిన పనులకు గాష్ఠములు తక్కువగానుండును. అంతియకాదు. యంత్రములు తుప్పుపట్టక సరిగాఁ దిరుగుటకు నూనె యుండవలెను; నూనె వెల పెరుఁగును. కావున యంత్రములను విసర్జించుటవలన ముఖ్యములయిన పదార్థములన్నియును మిక్కిలి చౌకగా దొరకును.

—• స్వల్పయంత్రములు •—

మన పూర్వులు యంత్రము లక్కఱలేకయే తమ వ్యవహారములను జూచుకొనుచుండిరి. యంత్రముల నెచ్చటనయిన వాడినను, స్వల్పములయినవి మాత్రమే వాడుకొనుచుండిరి. పరిమాణమునఁ బెద్దవి వారుపయోగింపలేదు. నిర్మాణమునఁ గ్లేశావహములయినవి యంగీకరింపలేదు. ప్రకృతియందనేక భాగములుగలవి గల్పింపలేదు. వికృతియందపాయకరములయినవి సంభావింపలేదు. వారి నాళికాయంత్రమొక్క వెనుకగొట్టు మీఁదా



మఱియు, భిక్షుకునివలనఁ గొత్తమునకు ఖేదమెక్కుడుగానుండును. బీద యీ వస్తువు లేదనియు నా వస్తువు లేదనియుఁ బ్రాయికంబుగా దుఃఖించుచునేయుండును.

మఱియు, నెవ్వఁడును జీవనోపాధికే శక్తియుక్తులన్నియు నుపయోగింపఁబడి యుండుటవలనఁ గ్రొత్త విషయంబులఁ గనిపెట్టుటకవకాశము లభింపదు. కాఁబట్టియే, యింగ్లాండున్నగు దేశములందుఁ బ్రత్యేకము నవీన విషయంబులఁ గనిపెట్టుటకుఁ గొందఱు నియమింపఁబడి వేతనములచే సంరక్షింపఁబడుచున్నారు.

దరిద్రునకు బంధుమిత్రులంతగా సహాయకారులుకారు. చీమలు బెల్లముచుట్టును మూగునట్లు సంపదను బంధుమిత్రులాశ్రయించియుందురు. బెల్లమయిపోయినతోడనే, చీమలును వెళ్ళిపోవును. ఆవిధమున, దారిద్ర్యమురాఁగానే మిత్రానురాగము పలాయనమగును. "యావద్విత్తోపార్జన సక్తః తావన్నిజపరివారో రక్తః" అని శంకరాచార్యులు నుడివియున్నారు.

ధనసంపత్తిచేత విద్యాదిగుణముల కొకవిధమైన ప్రకాశముకల్గును. ధనహీనతచేనట్టి ప్రి

కాశముండఁజాలదు. ధనికుని జ్ఞానము స్వల్పమైనను, నమితముభంగిఁ బ్రబలమనంబునఁ దట్టును. ద్రవ్యవిహీనుని జ్ఞానసంపద యధికమైనప్పటికి, స్వల్పమైనదిగాఁ బొడకట్టును. కాఁబట్టియే ‹‹ధనమూలమిదంజగత్ ›› ‹‹అంతరం నాభిజానామి నిర్ధనస్య మృతస్యచ ›› (ధనహీనునకును మృతునకును భేదము కానరాదు) అని పూర్వుల వాక్యములు. ‹‹ సర్వేగుణాః కాంచనమాశ్రయంతి ›› అని భర్తృహరి వచనము.

కాఁబట్టి, దారిద్ర్యమువలన లాభములకంటె నష్టము లధికములగుటచే నది పరిహారయోగ్యంబే యగుచున్నది.

—• పట్టుదల •—

విఘ్నము లనేకములు సంభవించినను గార్యనిర్వహణమునకొఱకుఁ బ్రయత్నమును మానక సాగించుట పట్టుదల. బాలుఁడు పడుచు లేచుచు నడుచుట నభ్యసించుచున్నాఁడు. సముద్రమునకడ్డముగా జలబంధంబు నిర్మించు సమయమునఁ బ్రవాహవేగమున నయ్యది కొట్టుకొనిపోవుచున్నను, మరల మరలఁ బాషాణాదులమర్చి వారధిని శ్రీరాముఁడు కట్టియున్నాఁడు.



ఇట్టి పట్టుదలవలన వివిధలాభములున్నవి. శరీరాభివృద్ధి రోగాదులచే నడ్డగింపఁ బడినప్పుడౌషధాది సేవవలనఁ బ్రతిబంధములు తొలగింపఁబడి శరీరముబలమయినదిగాఁ జేయఁబడుచున్నది. కొందఱు స్వాభావికముగా దుర్బలగాత్రులయ్యును చిత్తోపచారములచేత స్వాస్థ్యముఁ బొందుచున్నారు. వ్యాయామవిద్యయందుఁ బ్రసిద్ధినిఁగాంచిన సేండో యను వాఁడును, వైద్యమునఁ బ్రఖ్యాతి నందిన కుహానీ యనువాఁడును, నిట్టివారే. గ్రీసు దేశమున డెమస్తనీను నత్తిగలవాఁడయ్యు, సముద్రతీరమునకుఁ బ్రతిదినము నొంటరిగాఁబోయి, యచ్చట రాతిముక్కలను నోటఁబెట్టుకొని, బిగ్గరగా నుపన్యసించి, తుదకాదోషమును బోఁగొట్టుకొనినవాఁడగుటయేగాక వక్తలలో నగ్రగణ్యుఁడుగా మాఱెను.

మఱియు, విద్యాస్వీకారముఁ జేయునప్పుడు మనోదౌర్బల్యముచే గ్రంథకారుని యభిప్రాయమును గ్రహింపనివాఁడు నిరుత్సాహమునందక పండిత వాక్యశ్రవణమువలన నభిప్రాయమును గ్రహింపఁగలఁడు. కొందఱు మూఢులని పరిహసింపఁబడి స్వగ్రామములను విడిచి కాశీపురం

బునకేగి యచ్చట విద్యనభ్యసించి గొప్ప విద్వాంసులై మరల స్వగ్రామములకువచ్చి గౌరవమునొందినవారు

అరిషడ్వర్గముచేఁ జిత్తమనేక పర్యాయములు విక్షేపంబు నొందింపఁబడుచున్నను, ఈశ్వరధ్యానాదులవలన నయ్యది శాంతముగాఁ జేయఁబడుచున్నది. శంకరాచార్యుల గురువులకు గురువులగు గౌడపాదాచార్యులిట్లు పల్కియున్నారు -

ఉత్సేక ఉదధేర్యద్వత్కుశాగ్రేణైకబిందునా।
మనసో నిగ్రహస్తద్వద్భవేదపరిఖేదతః॥

(కుశాగ్రముచేత నొక్కొక్క బిందువుచొప్పున సముద్రజలమంతయును దోడివేయుట యెట్లో, విసుగునందక ప్రయత్నించుటవలన మనంబును నిగ్రహించుటయు నగును)

పూర్వమొక టిట్టిభంబు సముద్రము నెండించుట కటులఁ బాటుపడుచుండ గరుడుండు కరుణించి యాపక్షికి సాయమొసర్చి మనోరథముఁ దీర్చెనని యొకకథ పురాణములందుఁగలదు. కావునఁ జిత్తమునఁబుట్టుచున్న సంకల్పములను బోఁగొట్టుట సముద్రమునందలి జలంబులను బాఱఁబోయుటవంటిది.



—శ్రమవిభాగము—

శ్రమవిభాగమన నొకపనికి వలయు శ్రమనంతయు నొక్కఁడే పూనక పలువురు పంచికొని వహించుట. ఒకగొప్పగృహము నొక్క మనుజుఁడే నిర్మింప సాగెనేనిఁ వాఁడాపనిని నెరవేర్ప లేకపోవుట యేకాక తదుద్యమంబునఁ దన సర్వస్వంబును గాలంబును గోల్పోయి చేటుఁ జెందును. అటులనే, యధిక భారంబుగల పాషాణంబు నొకపురుషుండెత్తలేకున్నను బహుపురుషులతి సౌకర్యముతో నెత్తఁగలరు. కాఁబట్టి కార్యనిర్వాహణంబునకు బహుపురుషు లేకీభవించి శ్రమపడుట లాభకరము.

కాని కొన్నిపనులకనేక పురుషపరిశ్రమంబనవసరంబు. అదియెట్లన నొక సూక్ష్మకం దేపలయున్న నొక పురుషుఁడే తత్కార్యమునకొప్పు. అనేకులాపనిఁ జేయఁదొడంగిరేనిఁ దాటి దూలంబునకు సూదినిఁగ్రుచ్చి మిక్కిలి కష్టముతో దాని నండజును మోయుచు, స్వల్ప శ్రమంబును స్వల్పతరంబుగాఁ జేసి కొననెంచి యధిక శ్రమంబున నవసరంబుగా మీఁదవైచికొనిన పరమానంద శిష్యులభంగి హాస్యాస్పదు లగుచున్నవారు. కాఁబట్టి యనేకులేకీభవించి పనిఁ జేయవ

లెనన్న, ననేక పురుషపరిశ్రమంబున కవకాశం
బుకల పనియందుమాత్రమే బహుజనులు కలసి
పనిఁ జేయవలయునని నాయభిప్రాయము. ఇట్లు
కార్యమును సర్వంబును జేయుట విషయమై యా
లోచించితిమి.

ఇప్పుడు, కార్యాంగముల ననేకులు విభజించి
కొని నిర్వహించుట విషయమై కొంత విచారిం
తము. ప్రకృతి యీవిషయము మనకు జ్ఞానం
బు నిచ్చుచున్నది. ఎట్లన, భూమి సమస్తభాగ
ములనుండియు సస్యములు, ఫలములు, లోహము
లు, మొదలగు పదార్థముల మనకొసంగక కొన్ని
భాగములనుండి మాత్రమే కొన్ని వస్తువుల ని
చ్చుచున్నది. భూమికంతకును నేకవిధమైన పరి
శ్రమంబే లేదు. ఆరీతినే, జనసముదాయంబు నం
తకును నేకవిధమైన వృత్తియే లేక, భిన్న జ
నులకు భిన్న వృత్తులుండవలెను. ఇంతయేల? మన
దేహమునే పరీక్షింతము. దేహమంతయు రూప
వైచిత్ర్య శూన్యంబై యేక రూపంబైన మాంస
పిండంబుగా లేనిచందంబున, మానవసృష్టి యం
తయు నొక్కవృత్తికే యోగ్యతఁ గల్గియుండ
దు. వివిధవృత్తులందు వివిధజనులు కుశలులగుదు



న్నారు. కాఁబట్టి, యేవృత్తికి నెవ్వఁడర్హుఁడో
యావృత్తిని వాఁడే పూనవలయును. పానిను చే
యఁగలపనిని నయనంబెట్లు చేయఁజాలదో యా
రీతినే బట్టలనుగుట్టుట కలవడినవాఁడు, క్షౌరమున
కలవాటుపడిన వాని వృత్తి నవలంబించినచోఁ
గీడుఁ జెందు. శరీరమంతయు నేకాకారముగల్గి
మాంసపిండంబువలె నుండుట దేహపరిణామంబు
నఁబ్రాథమికావస్థ నెట్లు సూచించునో, యారీతినే
మానవులందఱు నేకవృత్తి నవలంబించుటయు
మానవుల ప్రాథమికావస్థ సూచించును.

మఱియు, శ్రమవిభాగము కాలముచేతనే
సంపాదింపఁబడుచున్నది. ప్రకృతిచేతనే యదిలో
కములోనికి వచ్చినదని చెప్పవచ్చును. ఒకఁడొక
పనిజేయ నారంభించినప్పుడు దాని యంగములన్ని
యును దానే నిర్వహించుటయందు సౌకర్యంబును
గానక కొన్నిటి నితరులకుఁ బంచిపెట్టును. కాఁ
బట్టి సమస్త వృత్తులను నొకవిధముయిన మాన
వులే చేయుసమకట్టి ఫలముఁ బడయఁగలమని త
లంచినను జివరకెవ్వరి యర్హతను బట్టి వారా
వృత్తిని మాత్రమే యవలంబింపవలసివచ్చును.

అన్నిపనుల నొక్కఁడే చేయుటవలన న

వ్వాండేవృత్తి వాఁడో తెలియక యింటినిఁగట్టించి కొనుటకై వైద్యుని యొద్దకును, వైద్యముఁ జేయించుకొనుటకు శిల్పియొద్దకును బోపుట సంభవించును. ఎవ్వనివృత్తి వానికి వేఱుగా నేర్పడినచో నిట్టిభ్రాంతి కవకాశముకలుగదు.

మఱియు, మానవుని శక్తియు జీవితమును స్వల్పపరిమాణములుగలవి. కాఁబట్టి తక్కువయైన శక్తియుఁ గాలమును వ్యయముచేసి యెక్కుడుపనిని సాధించుట భావ్యము. అట్టి కార్యమునకు శ్రమవిభాగ మావశ్యకము. ఏలయన నొక గొప్ప గ్రంథకర్త తనకాలము నాలోచించుటలోను గ్రంథముల ముద్రించుటలోను గూడ వ్యయపఱచికొనిన పక్షమున, నాలోచించుటకు వలయుకాలము చాలకుండుటచే నుత్తమ గ్రంథముల వ్రాయఁజాలఁడు. గ్రంథ ముద్రణాది కర్మలఁ జేయువారు వేఱుగా నేర్పడియున్నచో గ్రంథప్రణేత తనబుద్ధి బలమంతయు వినియోగించుట కవకాశము లభించును.

మఱియుఁ, జిత్తరువుల వ్రాయుటయందు నేర్పరి యొక్కరుండు చిత్తరువులఁ జిత్రించుటకు వలయుపటములఁగూడ నేయనారంభించినచో స్వ



కర్మ యందెక్కువ నేర్పుఁ జూపఁజాలఁడు. తత్పట నిర్మాణమునం దధికకాలము గతించును. పట నిర్మాణమునఁ బ్రావీణ్యము గలవానికంటె లేనివాఁడెక్కుడు శ్రమనొంది యధికతరకాలమును వ్యయముఁ జేయవలసియుండును. పటనిర్మాణనైపుణ్యముఁ జిత్ర రచనానైపుణ్యముఁ బ్రకటింపఁజాలదు. కాఁబట్టి యట్టి మనుజుఁడు స్వోచితకర్మమాని పరకర్మ నాచరించుట వలన లాభములేదు. అదియునుగాక, శ్రమవిభాగము వైవిధ్యముగల పురుషులసేవ లేకీభవించుట నభ్యాసపఱచును. గాయకుల మేళములోనివారు వివిధ ధ్వనులఁ జేయుచున్నను, వాని కన్నిటికిని సామరస్యముఁ గల్గించి యేక మూర్తిత్వ మొసంగుచున్నారు. అవ్విధంబున నొక కార్యముయొక్క వివిధాంగములఁజేయు వివిధమనుష్యులు తత్కార్యమునంతయును సాధించుటయే గాక వైవిధ్యమును మఱుఁగుపఱిచి సామరస్యమును సంపాదింపఁగలరు. ఇట్టివైకమత్యము (Harmony) నందు శాంతియున్నది.

హిందువులు శ్రమ విభాగము "నిమి—మే చాతుర్వర్ణ్యవ్యవస్థను స్వీకరించియనాకాలంబున నత్యున్నతావస్థ ననుభవించిరి. నానాటికి

వర్ణ సంకరమై వృత్తి యోగ్యతా విశేషము న కనుగుణంబగు వర్ణ విశేషము లభించుటమానే; వృత్తి వ్యామోహ ముద్భవించె. అప్పుడు చాతుర్వర్ణ్య వ్యవస్థను (శ్రమవిభాగము నుద్దేశించి యే స్వీకరించి యుండిరి. ఈ కాలమున దాని ఫలమెట్లున్నను వారి యుద్దేశము మాత్రము మంచిదియై యుండునని యనేకు లంగీకరించుచున్నారు.

ఒక విశిష్టమైన వృత్తి నే యొకం డవలంబించి నప్పుడా వృత్తియందు వాఁడు తన శక్తి నంతయును వినియోగముఁజేసి దానియం దధిక కౌశలంబును సంపాదింపఁగలఁడు. అనేక వృత్తులైనచోఁ జిత్త విక్షేపంబు గలుగును. తద్వృత్తులందుఁ దనశక్తి వ్యాపించి పల్చనై పోవుటచే నతఁ డేవృత్తి యందును నతిశయముగాఁ బ్రౌఢిమ నొందఁజాలఁడు.

ఒకవృత్తియందు సామర్థ్యములేనివాఁడు మఱియొక వృత్తియందుఁ బ్రవేశింపవచ్చును. కాని, నిష్కారణముగా వృత్తిని మార్చి వేఱొక వృత్తియందుఁ గాలమును వ్యర్థముచేయఁ జనదు. శ్రమవిభాగము త్రిమూర్తులచే సూచింపఁబడుచున్నది. ఈశ్వరుఁ డొకఁడే యైనను బ్రహ్మ



విష్ణు మహేశ్వర విభాగమునంది సృష్టి స్థితి సంహారములను నిర్వహించుచున్నాఁడని వర్ణింపఁబడుచున్నది. సమస్తశక్తులతో నిండియుండు పరమేశ్వరుఁడే సృష్టిభేద మారోపింపవలసి వచ్చినప్పుడే దుర్బలులయిన మానవులమాటఁ జెప్పవలెనా?

## —అర్థము—సనాతనమతము—

కొందఱు మూఢులు హిందూమత మొక మోక్షమును మాత్రమే బోధించుచున్నదనియు, కాఁబట్టి హిందూమత మవలంబించువారికి ద్రవ్యసంపాదనాదికముఁ జేయుట కెక్కడ నవకాశము లేదనియు, నుడువుచున్నారు. కాని వీరు చెప్పునది సత్యము కాదు. ఏలయన హిందూమతమందు మోక్షము మాత్రమే చెప్పఁబడలేదు; ధర్మము మాత్రమే నుడువఁబడలేదు. ధర్మము, అర్థము, కామము, మోక్షము, అను చతుర్విధ పురుషార్థములును హిందూమత ప్రోక్తములని యెవ్వఁడెఱుఁగడు? మఱియు వేదము రెండువిధములైన ధర్మముల బోధించుచున్నది. ఇందులకుఁ బ్రమాణము "ద్వివిధో హి వేదోక్తో ధర్మః, ప్రవృత్తిలక్షణో, నివృత్తిలక్షణశ్చ" (వేదముచేఁ జెప్పఁబడిన ధర్మము రెండువిధములైనది. ప్రవృత్తిలక్షణమైనది, నివృత్తి

లక్షణమైనది.) అని శంకరాచార్యవిరచిత గీతాభాష్యమునందు నిరూపింపఁబడినది. మనుస్మృతియందు "సుఖాభ్యుదయికంచైవ నైఃశ్రేయసిక మేవచ ప్రవృత్తంచ నివృత్తంచ ద్వివిధం కర్మవైదికం" (సుఖాభ్యుదయికంబైనదియు నైశ్శ్రేయసిక మైనదియు, ననఁగఁ బ్రవృత్తిలక్షణమైనదియు నివృత్తిలక్షణమైనదియు వేదముచే నుపపాదింపఁబడినకర్మ రెండువిధములు) అని ప్రతిపాదింపఁబడినది. అర్థసంచయమీప్రకృతిలక్షణంబైన ధర్మమునకు సాధనముగా నున్నది. కాఁబట్టి హిందూమతము ప్రకృతిలక్షణమైన ధర్మమును బ్రతిపాదించుచున్నదని యంగీకరించినప్పుడు తత్సాధనమైన ధనముకూడ నార్జింపవచ్చునని హిందూమతముయొక్క యాశయమని యంగీకరింపక తప్పదు. కాఁబట్టి హిందూమతము మూలమున హిందువులైశ్వర్యవిహీనులైనారని యెట్లు చెప్పఁగలము? ధనార్జనము వేదవిరుద్ధము కాదనుటకు సురేశ్వరాచార్యకృతంబైన తైత్తిరీయభాష్యవార్తికమునుండి శ్లోకములను భాషాంతరీకరించుచున్నాను "ఈలోకమునందుఁగాని, పరలోకమునందుఁగాని, శుభములుగల్గించు కార్యములు ధనసా



ధనమువల్లనే సమకూరుచున్నవి. ఆధనము రెండువిధములు, మనుష్యసంబంధమైనది, దైవసంబంధమైనది. భౌతిక ధనమనఁగా ద్రవ్యాదికము. పారమార్థికధనమనఁగా నీశ్వరోపాసనయు జ్ఞానమును లోనగునది. కాఁబట్టియే యీరెంటినిమిత్తము ప్రార్థనము" అంతేకాదు. తైత్తిరీయోపనిషత్తునందు "కుశలాన్న ప్రమదితవ్యం" (క్షేమమునుండి తప్పవలదు) "భూత్యైన ప్రమదితవ్యం" (ఐశ్వర్యమునుండి తప్పవలదు) అని విధింపఁబడినది. శ్రీవిద్యారణ్యస్వామి వ్రాసిన వ్యాఖ్యానము నాంధ్రభాషలోనికి మార్చుచున్నాను:— "అత్ర సంరక్షణార్థము సాధనములు భౌతికములు నభౌతికములు నైయున్నవి. దీర్ఘాయుర్దాయము నిమిత్తము నారోగ్యము నిమిత్తమును గర్మలను వేదములు విధించుచున్నవి; ఇట్టివి యభౌతిక సాధనములు. ఔషధాదులు భౌతిక సాధనములు. అటులనే, ధనార్జనమునకుఁగూడ భౌతికాభౌతిక సాధనములు రెండువిధములైనవియుఁ గలవు. తైత్తిరీయసంహిత యభౌతిక సాధనము నొకదానినిఁ జెప్పుచున్నది. పరులనుండి దానస్వీకరణము భౌతికసాధనము. ఆరోగ్యము ధనము లేనియెడల మోక్షముఁ బ్రాప్తిం

పం చేయు భాగ్యము లనుభవించుట యసంభవము. కాబట్టి యారోగ్యమును ధనమును నుపేక్షింపం గూడదని విధించుట కవసరమైనది." ధనసంపాదనము భౌతికసాధనము దానస్వీకరణమొక్కటి మాత్రమేయై యున్నదని పద్యార్థమ్ముల యభిప్రాయము కాదు. మఱియేమన, అనేక సాధనములుండ, వానిలో దానస్వీకరణము నొకదాని నుదాహరణంబుగా నిచ్చియున్నారని తెలియవలెను. మఱియు హితోపదేశమందు "అజరామరవత్ప్రాజ్ఞః" అనియున్నది.

శ్లోకముయొక్క యర్థమే "జరయు మృతియులేని జనునట్లు ప్రాజ్ఞుండు ధనమువిద్య గూర్పం దలంపవలయు" అని వర్ణింపంబడినది.

కాబట్టి సనాతనమత మైహికాభివృద్ధి కడ్డువచ్చునది కాదు.

—మనోబలము—

బలమనేక విధములై యొప్పుచున్నది. ఎట్లన, మనోబలము, అర్థబలము, ప్రజాబలము. వీనిలో మనోబలమే ముఖ్యమైనది.

విషయము బోధపడుటకై యొకపట భోజచరిత్రమునుండి యొక కథ నుదాహరించుచున్నాడను.



ఒక విద్వత్కుటుంబము విద్యాప్రియుండయిన భోజమహారాజు పాలింపంబోయి నిచ్చువేగా, నాంకొక సమస్యనిచ్చెను.—

"క్రియాసిద్ధిః సత్త్వేభవతి మహతాం నోపకరణే"

(కార్యసిద్ధి పురుషుని సామర్థ్యమందు, మహిమయందుం, గలదు గాని పరికరములందు లేదు)

అప్పుడు వృద్ధబ్రాహ్మణుండిట్లు సమస్యను బూరించెను —

ఘటోత్పన్నస్థానం, మృగపరిజనో, భూర్జవసనో
వనేవాసః, కన్దాదికమశనం, మేవంవిధగుణః,
అగస్త్యః పాథోధిం యదకృతకరాంభోజకుహరే,
క్రియాసిద్ధిః సత్త్వేభవతి మహతాం, నోపకరణే.

(కుండయే పుట్టినచోటు, లేళ్ళే పరివారము, భూర్జపత్రములే వస్త్రములు, వనమునందే నివాసము, దుంపలుమొదలైనవియే భోజనపదార్థములు. ఇట్టి లక్షణములుగలవాడయినను నగస్త్యమహాముని సముద్రమును దనకరములను బోలినయరచేతి పల్లమునందిముడ్చెనట్లేల చేయంగల్గెనో, యాహేతువుచేత మహాత్ములకుం గార్యసాఫల్యము తమ ప్రభావమందుంగలదు, సాధనములందుంగాదు.)

ఆపద్యమును సంతోషించి రాజు వానిని సత్కరించి, పిమ్మట నా నిభార్యనుబిలచి "తల్లి, నీవును బఠింపుము" అని ప్రార్థింపఁగా, నామె యీరీతిగా మహాత్ముల మహిమావర్ణించెను:—

రథస్యైకం చక్రం,భుజగయమితాః సప్తతురగాః
నిరాలంబోమార్గ, శ్చరణవికలః సారథిరపి
రవిర్యాత్యేవాన్తం ప్రతిదినమపారస్యనభసః
క్రియాసిద్ధిః సత్త్వేభవతి మహతాం నోపకరణే

(రథమున కొక్కటియేచక్రము, గుఱ్ఱములేడును సర్పములతోడనే కట్టఁబడుచున్నవి, ఆధారము లేనిదేమార్గము, కాళ్ళులేనివాఁడే రథమును నడుపువాఁడు. అయినను సూర్యుఁడు ప్రతిదినమును నపారమయిన యాకాశముయొక్క చివరకుఁబోవుచున్నవాఁడు. కాఁబట్టి మహాత్ములకు సత్త్వమందే క్రియాసిద్ధియున్నది. ఉపకరణములందు లేదు)

సంతసించి త్రిభువు రథములు మున్నగువని యామెకు దానముచేసెను.

తరువాత బ్రాహ్మణపుత్రునిఁబ్రశ్నింప, నాతఁడీ పద్యముం బఠించెను:—

విజేతవ్యాలఙ్కా చరణతరణీయోజలనిధి,
ర్విపక్షః పౌలస్త్యో, రణభువిసహాయాశ్చకపయః



పదాతిర్మర్త్యోసౌ సకలమవధీద్రాక్షసకులం,
క్రియాసిద్ధిస్సత్త్వేభవతి మహతాం నోపకరణే॥

(జయింపవలసినది లంక పాదములతో దాఁటవలసినది మహాసముద్రము విరోధి పులస్త్యవంశజుఁడుయొక్క మనుమఁడయిన రావణుఁడు. యుద్ధరంగమునందుసహాయము మర్కటములు కాలుబంటు మానవమాత్రుఁడు అయినను శ్రీరాముఁడు రాక్షసవంశమును సర్వమును నాశము చేసెను. కావున గొప్పవారి కార్యములు స్వసామర్థ్యముచేతనే సాధింపఁబడుచున్నవి. బాహ్య సాధనముచేతఁ గాదు.)

రాజు సంతుష్టుఁడై వానికి గజేంద్రములనిచ్చెను. పిమ్మట వృద్ధబ్రాహ్మణుని కోడలినిఁజూచి శ్లోకమడిగెను. ఆమె యిట్లు పఠించెను.

ధనుఃపౌష్పంమౌర్వీ మధుకరమయీ,
చఞ్చలదృశాం । దృశాంకోణో బాణః
సుహృదపిజడాత్మా హిమకరః ।
స్వయం చైకోనఙ్గః సకలభువనంవ్యాకులయతి,
క్రియాసిద్ధిః సత్త్వేభవతి మహతాంనోపకరణే॥

(విల్లు పుష్పసంబంధమయినది వింటినారి తుమ్మెదరూపమయినది । చంచలములయిన స్త్రీల

లుగల పనివలమూపుణ్యాత్ము యగ్రగామే బాణము లు. అచేతనస్వరూపుఁడయినట్టియు మందబుద్ధిగల్గినట్టియుఁ జంతువుఁ దేమ్మతోఁడు కాకోటులకుఁ డయినవాఁడు, శరీరము లేనివాఁడు. అట్టి వాఁడయ్యు మన్మధుడు సమస్త జగత్తును వ్యాకులముచేయుచున్నాఁడు. కావున మహాత్ములకుఁ గార్యనిర్వాహమందుఁ బరాపేక్షలేదు )

ద్రవ్యము లేనందున నేను వాణిజ్యము చేయలేకపోతిఁ లనని సామర్థ్యము తెలివాఁడును శక్తిగలవాఁడు ఋణమును జేసి వ్యాపారము సాగించుచుఁ గోటీశ్వరుఁడు కాఁగలఁడు, స్వల్పమయిన మూలధనముతోఁ బ్రారంభించి క్రమముగా ధనమును వృద్ధి బొందించును. శిల్పియైనను సమర్థుఁడు కానివాఁడు వడ్రము మొదలగు పనులకుపయుక్తములయిన సాధనములు లేవని ఘోషించును. అట్టిసాధనము లన్నియును సమకూర్చినను సరియు వానినుపయోగపఱచుటకు శక్తి చాలనివాఁడై, యొకచోటఁగోయవలసినచోట మఱియొకచోటఁగోసి పనిఁ బాడుచేయుటయేగాక తన దేహమునకు సహితము హానినొనరించుకొనును. ఇంగ్లీషులో "A bad workman finds fault with his tools"



(చెడు పనివాఁడు తనపరికరములను దూషించును.) అని చెప్పఁబడుచున్నది. మఱియు వ్యవసాయమందు నాకుఁ గౌశలముగలదు గాని భూమిలేక పోవుటచేత నేమియును జేయలేకయుంటినని కొందఱు వదురుచుందురు. ఇతరుల భూమిని అద్దెకుఁదీసికొనవలదా? అట్టి కౌశలమే నిజముగాఁగలదేని నా కౌశలమువలనఁ జూపుము నిర్వ్యాపారమునఁ గాలము నెన్నఁడును వ్యర్థముఁ జేయకుము. నేను తలంపలేదు, తలఁచియుండినచో శత్రుమండలము సర్వమును ధ్వంసము చేసియుందునని దుర్బలుఁడయిన యుద్ధభటుఁడు పరిగల్భ వాక్యములు పల్కుచుండును. నాకు ఖడ్గము లేకపోయినదని మఱియొకఁడును శతఘ్ని లేకపోయినదని యొక నొకఁడును మినుకుగల్పించి పలాయనమగును. సాధనసామగ్రి లేకపోయినను శత్రుశిబిరంబుల నాక్రమించిన వారన్ని దేశములందును బూర్వకాలమునను సిరి, తమకోటలను గాపాడుకొనిన వారలును విలసిల్లిరి. ఒకరాజు దుర్వ్యసనములకు వశుఁడై, ధూర్త సంరక్షణము నుపేక్షించియుండ, నొకసైనికపుంగవ మంత్రికరయు రాజాజ్ఞని దుర్గము ముట్టడించెను. ఏమిచేయవలెనో తెలియక రాజును తత్పరి

వారంబున వ్యాకులతఁజెందియుండ, బుద్ధిమంతుఁడయిన మంత్రి ద్వారములను బంధించి, లోపలిజనులచేత నపరిమితద్రవ్యములను జేయించుచు, నసంఖ్యాకులయిన సైనికులు దుర్గమునమండిరనియు, వరుసగా భోజనముఁ జేయుచుండిరనియు బాహ్యప్రదేశమునన్న వైరివర్గము తలంచులాగునఁ బర్యాయముగఁ గొన్ని భోజనపత్రముల చొప్పున ననేక పర్యాయముల నేక పత్రములను బ్రాకారములనుండి యావలికిఁ బడవేయింపసాగెను. ఇన్ని పత్రములందు భుజించిన వారెందఱో యుందురని భావించి వెలుపలనున్న వారు ముట్టడిని మాని వెడలిపోయిరి. అంత మంత్రియొక్క చాకచక్యమునకందఱును సంతోషించిరి, మఱియునొకఁడు నిబిడాంధకారమునఁ బయనముఁ గావించుచుండఁ బోయలుకొందఱాయుధ పాణులగుచు యాతని పైఁబడిరి. ఆధీరుఁ డెంతమాత్రమును భయభ్రాంతుఁడుగాక యొకరాతినిదీసిదూరముగా విసరివైచెను. అప్పుడది విలువగల పదార్థమేదియో యైయుండునని భ్రమించి యాదొంగలలోఁ గొందఱుదానినన్వేషించుచుఁబోవఁగా, నతఁడుతనయెదుటనింకను నిలిచియుండిన వానిహస్తమునుండి



# అర్థశాస్త్రప్రచంద్రిక.

పశ్చిమదేశములందు యంత్రములనేక కార్యముల కుపయుక్తములగుచున్నవి. బట్టలు నేయుట మున్నగు పనులు యంత్రములే నిర్వహించుచున్నవి. పాశ్చాత్యుల గొప్ప యంతయును యంత్ర పరతంత్రమయి యున్నదని మనదేశమునఁ గొందఱు భ్రమించి యంత్రముల నిచ్చటఁ గూడ స్థాపించుటకుఁ బ్రయత్నములు చేయుచున్నారు. వీనివలనఁ గలుగు నష్టములను బాశ్చాత్యులనుభవించుచునే యున్నారు. మన సంఘసంస్కారులు పశ్చిమఖండవాసుల చరిత్రములను జదివితి మని విఱ్ఱవీఁగుచుందురు; కాని నేత్రములను బాగుగ విప్ప మనవారెద్దియును జదివినవారు కారు. ఇప్పుడు యంత్రముల వలన సంభవించునట్టి యనర్థములను సంక్షేపముగాఁ జేర్కొనుచున్నాను.

## — జీవనోపాధిలోపము —

యంత్రములవలనఁ బ్రయోజన మేమి? మానవశ్రమ తగ్గుటయేకదా? యంత్రములు లేని

పటుమున నూర్వురు చేయఁగల్గిన కార్యమును యంత్రసహాయముగల సమయమున మువ్వురయినను సాధింపఁగల్గియుండుట ముఖ్యలాభమని కదా చెప్పఁబడుచున్నది? అప్పుడు మిగిలిన 97 గురు మానవుల పని యేమి కావలెను?, వారికి జీవనాధార మేది? వారితర వృత్తులయందుఁ బ్రవేశింపవచ్చు నందురేమో. కాని వానియందును యంత్రములు స్థాపించి వారి జీవనమున కంతరాయమును గల్గించును. ఇట్టి హేతువుచేఁ బశ్చిమ ఖండములయందుఁ బనివాండ్రెంతయు బాధపడుచున్నారు. యంత్రములవలన మానవపరిశ్రమకవకాశము తగ్గదని వాదింతురేమో. ఇఁక యంత్రము లేల? యంత్రనిర్మాణక్లేశముగూడ నెందునిమిత్తమో? కొందఱికిఁబని కల్పించుటకు యంత్రనిర్మాణము కావలసియున్న దందురేని, వస్త్రాది నిర్మాణమునకు యంత్రము లావశ్యకము లనియు, వృత్తికల్పనమునకు యంత్రనిర్మాణ మావశ్యక మనియుఁ జెప్పుట యగును. అట్లుగాక వస్త్రాదినిర్మాణమంచే వృత్తికల్పనముగూడ సిద్ధించినయెడల లాఘవముకదా? మఱియు నొకయంత్రమును నిర్మించుటయందు మఱియొక యంత్రముపయోగింపఁబడినయెడల, యంత్రములు మాత్రము జీవింపఁగలవు; మానవులు బ్రతుకు టెట్లు? మానవులు నశించినను యంత్రములు వృద్ధిఁజెందినఁ జాలునని నుడువువారుండవచ్చును. ఇప్పుడు కొందఱు పనివాండ్రు లేనియెడల యంత్రములను త్రిప్పుట యసాధ్యమైనను, ఇఁక ముందు వారు గూడ నక్కఱలేకనే యంత్రములచేఁ బని చేయించుపద్ధతిని మానవునిబుద్ధి కల్పింపవచ్చును. అప్పుడీ స్వల్పసంఖ్యాకులకుఁ గూడఁ గూడు లోపించును. నూఱు గుఱ్ఱముల బలముగల యంత్రము (ఇంజన్) తొమ్మిదివందల బలమయిన మనుష్యులతో సమానము. లాంకషైరులోని దారమును దీయు యంత్రమొక పెద్దవాఁడును నిద్దఱు చిన్నవారును బనిచేసిన యెడల, నాలుగువేల చేతిపనివాండ్రు చేయఁగల బనిని నిర్వహించును. ఇఁక మానవుల గతి విచారింపుఁడు.



### — కుటుంబ శైథిల్యము —

భర్త యొకయంత్రశాలయందుఁ బని చేయుచుండ, భార్య మఱియొక శాలయందుఁ బని చేయుచుండును. పుత్రుఁ డింకనొక దానియందు శ్రమపడుచుండును. ఎప్పుడో యింటికి వచ్చిన

ప్పుడేగాని మఱియెన్నఁడును గుటుంబములోని వారు సహవాసము చేయుట కవకాశము లేదు. కావున నొండొరులకుఁ బ్రేమానుబంధము దృఢమైనదిగా నుండఁజాలదు. గృహమున భార్యాపుత్త్రాదు లందఱును గలసి యనుభవింపఁగల సుఖములకు వీరు దూరులగుచున్నారు. అట్లుగాక, చేతిపనులనుమాత్రమే చేయుచుండిన పక్షమునఁ బరస్పరసాహాయ్యముతో వస్త్రాదులను జేసికొనుచు నైకమత్యముతో సుఖముగా వారివారి గేహములందు నివసింపఁగలరు.

—♦ దౌర్బల్యము ♦—

యంత్రములవలన సోమరితనము హెచ్చి రోగములు జనించును. ధాన్యము దంచుట మొదలయిన పనులను జేసికొనువారు దృఢదేహములతో సౌఖ్య మనుభవించుచున్నారు. అట్టి పనులన్నియును యంత్రములపై నిడి మొద్దులవలెఁ గూర్చుండువారు రోగపీడితు లగుచున్నారు. ప్రత్యేకముగా వ్యాయామమును విధించుటవలన నామయమున కవకాశము కలుగనోపదని వాదింతురేమో. అనేకకార్యము లొకకార్యమునందే సిద్ధించుట యుత్తమపక్షము. తన వృత్తిని మా



నక, దేహమును గాపాడుకొనుటయే మంచిది. దేహారోగ్యముకొఱకింకనొక కాలమును వ్యయపఱుచుట కాదు. మానవులు యంత్రములకు బానిసలగుచున్నారు. యంత్రములు లేనిచో స్వల్పకార్యమైనను వారు నిర్వహింపఁజాలక దైన్యము ననుభవించుచున్నారు. పరాయత్తజీవన మింతకంటె నేమి గలదు? సంపెంగనూనెను జేయుటకు యంత్రము కావలయును. ఆనూనెను మీసములకంటించుటకు మఱియొక యంత్రము సిద్ధముగా నుండవలెను. భూమిని దున్నుటకొక యంత్రము, ధాన్యము బండించుటకింకనొకటి, బియ్యము చేయుటకు మఱియొకటి, అన్నము వండుట కొకటి, దానిని గలిపి ముద్దలుచేసి నోటిలోఁ బెట్టుట కొకటి, ఈవిధముగా సోమరితనము హెచ్చుచున్నది, ఆరోగ్యము నశించుచున్నది.

మఱియు జనులు స్వగ్రామములను విడిచి, పట్టణములను బ్రవేశించి, మలినపుసందులలో దుర్గంధముగల వాయువును బీల్చుచు, సూర్యుని కాంతికి దూరులై యుండుటంబట్టి, వారు చేవచెడినవారై, కాంతినశించినవారై, రోగబీజములకు సుక్షేత్రములయిన కాయములతో శీఘ్రమే కా

లుని పాలగుచున్నారు. యంత్రశాలలవలన హాని కలదు గావునఁ బట్టణమధ్యమందు వానిని నిర్మించుట కనుజ్ఞనీయరు. పశ్చిమదేశములం దున్మాదముగలవారి సంఖ్య హెచ్చుచున్నదనియు, నందులకు యంత్రశాలల సంరంభ మొక కారణమనియుఁ జెప్పఁబడుచున్నది. కఠోరమైన శబ్దము కర్ణములను బీడించుచుండును. ఆకాశమంతయును నల్లని పొగతో నిండియుండుటవలన నిర్మలమైన వాయువును బీల్చుట కవకాశము లభింపదు. పాడైన నీరు మొదలయిన పదార్థములు యంత్రశాలచుట్టును దుర్గంధమును వ్యాపింపఁజేయును. ఇట్టిబాధ లుండుటచేతనే, ధనికులు దేహమునందు జాడ్యముద్భవించినపుడు యంత్రములకు దూరముగా నొక గ్రామమునందు నివసించి యారోగ్యమును సంపాదించుచున్నారు. వారు యంత్రములతో నిండిన పట్టణమును బ్రవేశించినపుడు వాస్తవముగా నొక నరకమును బ్రవేశించునటుల భావించుచుందురు.

— ◆ శీలభ్రంశము ◆ —

స్త్రీపురుషు లనేకులు స్వేచ్ఛగాఁ జేరి, తమ తమ కులములకుఁ బెద్దలయినవారి సంబంధము లేనివారై, దుష్ప్రవర్తనమునకుఁ గడంగుచున్నారు.



వీరినిఁ జూచి వారును వారినిఁ జూచి వీరును వేషములు వేయుచుఁ, బై మెఱుంగులనే బహూకరించుచు, సదాచారమును రోయుచున్నారు. యంత్రశాలలందుఁ బనిచేయువారు సంపాదించిన ద్రవ్యములో నర్థభాగముకంటె నధికముగా సురాపానము లోనగు దురాచారములకు వినియోగింపఁబడి, స్వల్పభాగముమాత్రమే కుటుంబభరణమునకై యుంపఁబడుచున్నది.

ఇంక, యజమానులందు వీరికిఁ గల భక్తికిని విశ్వాసమునకును మేరయే లేదు. వీరు యజమానులను బరమేశ్వరులనియే నమ్ముచున్నారు. యజమానులు వీరియెడలఁ బుత్రవాత్సల్యమును జూపుచున్నారు. కలహములున్నను నయ్యవి ప్రణయకలహములే గాని కేవలకలహములు గావు. సేవ్య సేవక భావము వీరి యందే కదా సార్థకమగుచున్నది.

— ◆ అతివృష్టి: ◆ —

యంత్రములు లేనియెడల జనులకు ముఖ్యముగా నావశ్యకములైన వస్తువులు మాత్రమే చేయఁబడుచున్నవి; అధికముగా నుత్పాదించుట సంభవింపదు. కాని యంత్రము లత్యధికోత్పాద

సమునకై మానవులను ప్రోత్సహించుచు, దానిని సాధించును. అట్టివస్తువులకు స్వస్థానమునం దావశ్యకత లేదు, గావున నవి దేశాంతరములందలి జనులమీఁద బలాత్కారముగాఁ ద్రోయఁబడుచున్నవి. ప్రపంచమునందు నూతన శకమున జరుగుచున్న పోరాటములన్నియును యంత్రములచే నిర్వహింపఁబడుటయేగాక, యవి యంత్రమూలకములై యున్నవి. అట్టిపోరాటములు యంత్రబలముగల సంఘములకుఁ గ్రయ విక్రయాదులందలి స్పర్థచే నుత్పన్నము లగుచున్నవి. పూర్వకాలమున యంత్రములు లేనికతమున నిట్టి స్పర్థల కవకాశము కలుగలేదు. అప్పుడు పదార్థము లొక దేశమునుండి మఱియొక దేశమునకు స్వేచ్ఛగాఁ బ్రవహించుచుండెను; అచ్చట నయ్యవి యాదరముతో స్వీకరింపఁ బడుచుండెను. అన్యదేశమునుండి వచ్చినవారుకూడ నుచితరీతిని గౌరవింపఁ బడుచుండిరి; ఒక దేశమునందలి ప్రజల వైభవమునకును గౌశలమునకును మఱియొక దేశమునందలి ప్రజలాశ్చర్యపడి, వారిని శ్లాఘించుచుండిరి. యంత్రసాహాయ్యము నొందకయే ప్రజలు నిర్మించిన వస్తువుల మొత్తము స్వల్పమైనదిగా నుండును. అంతేఁ



గొంత స్వగ్రామమునందును, సమీపగ్రామములందును విక్రయింపఁబడుచున్నది. కొంత భవిష్యత్కాలమున నుపయోగమునకై యచ్చటనే భద్రముచేయఁబడుచున్నది; స్వల్పభాగము మాత్రమే పరదేశముల కంపఁబడుచున్నది. అచ్చటనది యపూర్వవస్తు సముదాయముగానో కేవలభోగోపకరణజాతముగానో జూడఁబడుచున్నది; స్వదేశమునందలి వాణిజ్యమును నిర్మూలించుటకై విదేశమునుండి ప్రవేశ పెట్టఁబడిన యత్యావశ్యకవసుసంచయముగా మాత్రము భావింపఁబడుటలేదు. కాని, యంత్రములున్నయెడలఁ దమవస్తువులకు మూల్యము తగ్గిపోవునను భీతిబాధించుచుండుటచే, నొక దేశమునందలి ప్రజలన్యదేశములందలి ప్రజల నీర్ష్యతోఁ జూచి, వారివాణిజ్యమును నాశము చేయుటకు వారివస్తువులపై భరింపరాని పన్నులను నిర్బంధములను గల్పించి, కలహములను బెంచుచుందురు. కాఁబట్టి లోకములో నవ్యాపాతమైన వాణిజ్యమును, నవాంతరము లేని శాంతియును, యంత్రయుగము నందు గగనకుసుమంబులు.

—దరిద్రకష్టము—

యంత్రములవలనఁ జేయఁబడినవస్తువులితర ప్రదేశముల కంపఁబడక పోయినను, మూలధనము ప్రవహింపక పోవుటవలన వ్యాపారమున నష్టము సంభవించును. విక్రయించుట నిర్మించుటతో సమానముకాదు, ఒకయంత్రము శీఘ్రమే యొకవస్తువును జేయఁగలదు, కాని, యేయంత్రమును దానిని వేగముగా నమ్ముటగాని, కొనుటగాని, చేయఁజాలదు. ఇట్లు విక్రయించుట కశక్యములైన వస్తువులు సృష్టింపఁబడినవి, అవి మూలఁబడియున్నవి, అవియు సొమ్మైయున్నవి గావున మన సొమ్ము రూపముగా నిరోధింపఁబడియున్నది, అది మనదైన పక్షమునఁ బనివాండ్రకగు వేతనములు మున్నగువానికి ద్రవ్యమెట్లువచ్చును? యంత్రశాల పూర్తిగా నశించువఱకును దానిసంరక్షణమునకుఁ గొందఱయినను దప్పరుగదా. అట్టి సొమ్మితరులనుండి గ్రహింపఁబడినదైన యెడల, నేతద్వ్యయమునకును వడ్డినిచ్చుటకును ధనమెయ్యది? ఇట్టిది ప్రవర్ధమానమైన వ్యాపారమా? మఱియు, యంత్రములకుఁగొంత ద్రవ్యమును, దత్గృహములకుఁ గొంతయును, గావలయును,



ఇట్లు యంత్రశాలా నిర్మాణమే మూలధనములో నధికభాగమును మ్రింగుచున్నది. ఇఁక యంత్రమునకేమైన నాటంకముకలిగి నది యాగిపోయిన యెడల, నయ్యది బృహత్కాయమును చైతన్యవిహీనంబునైన భూతంబువలె శోచనీయమైయుండును. మఱియు, యంత్రశాలానిర్మాతలు తాము పాడగుటయేగాక, యితరులనుగూడఁ బాడుచేయుచున్నారు ఏలయన వీరు విశేషముగా వస్తువులను సేకరించి యుంచుదురు; వానిని గొనువారుండరు, కొంతయొలుకలు మున్నగు వానివలనను, మఱికొంత కాలక్రమమునను, చెడిపోవును; తుదకమ్ముటకు సిద్ధపడినప్పుడు మూల్యముఁ దగ్గిపోవుటచే నష్టము కలుగును.

—అనావృష్టి—

యంత్రముల మూలమునఁ గొందఱు కోటీశ్వరులైరి గాన నైశ్వర్యమునకు యంత్రము లావశ్యకములని వాదించు వారుందురు. కాని, యంత్రములవలన లాభము కలుగునట్టి కాలము గతించినది. ఇటలీదేశమునందుఁ బనివాండ్రందఱును నేకీభవించి, యంత్రశాలలను స్వాధీనముచేసికొని, యజమానులను వెడలఁగొట్టి, దొరతనమువారి

తోఁ గూడ యుద్ధమున్నను సిద్ధపడిరనియు, నప్పుడు పనివారలు కూడ లాభమునందును యాజమాన్యమందును భాగ్గానునట్లు దొరతనమువారు నిర్ణయించి కొంతవఱకు శాంతిని నెలకొల్పిరనియుఁ, దెలియుచున్నది. కాని వైరమింతటితో ముగిసినదని మాత్రము మనము నమ్మఁజాలము. యంత్రములను శీఘ్రమే కట్టిపెట్టి, పూర్వపద్ధతుల ననుసరించి చేఁతిపనులు మాత్రమే చేసికొని న్యాయముగా జీవించుటకుఁ బనివాండ్రను విడిచిపెట్టినియెడల, వారింత కంటెను ఘోరములైన కార్యములను జేయఁగలరు. మఱియు రక్కసిబొగ్గు మొదలైన పదార్థములు చాలకపోవుటచేతనో ధనము సన్నగిల్లుటచేతనో, పనిచేయువారందఱును నొక్కసారి పనిమానుటవల్లనో, మనకు ముఖ్యముగా నావశ్యకమయిన వస్తువులలో నొక్కటియును లభింపదు. పశ్చిమదేశములందలి పట్టణములలో విద్యుచ్ఛక్తితోఁ బనిచేయువారు విరమించుటవలనఁ, బ్రజలందఱు నంధకారమున మునిఁగియున్నారు. గనులయందుఁ బాటుపడువారు పనిఁ జాలించినపుడు, వంటకైనను నిప్పులేకున్నయది. జలయంత్రములకాటంకముగలిగిన సమయమునఁ,



(త్రాగుటకైన నొకజలబిందువు దొరకకున్నది. రొట్టెలవాండ్రు కోపగించినచో, జనులు తిండిలేక మలమల మాడిపోవలసినదే. పటయంత్రము లాఁగిపోయిన పక్షమున, గోచికిఁగూడ గుడ్డలోపించును. ఔషధయంత్రము లించుక విశ్రమించినయెడల, మందునకైనను మందు కానఁబడదు. యంత్రప్రవర్తకులదయ తప్పిన, నొకనాగలిగాని సూదిగాని లేదనవలసినదే. అయోమార్గమున కడ్డుకలుగునేని, నెక్కడివాఁడక్కడనే నిలిచిపోవలెను. ఈశ్వరుఁడొసఁగిన శక్తులను గోల్పోయి రాక్షసశక్తుల నాశ్రయించిన యంత్రపరతంత్రుల జీవనమెంతశోచనీయము! పనివాండ్రు సమ్మెకట్టుటవలనఁ గొన్ని దేశములు రాజకములగుటయే గాక, వారివేతనములు హెచ్చినకొలఁది పదార్థముల మూల్యము హెచ్చుచుండుటచేతఁ బనివాండ్రలోఁ గాని యంత్రశాలాధికారులలోఁగాని జేరనట్టియు నేపాపము నెఱుఁగనట్టియు సామాన్య జనులావశ్యకములయిన వస్తువులనయినఁ గొనుటకును బ్రాణావసానసమయమందైనను భృత్యుల వలన సాహాయ్యమొందుటకును శక్తి చాలనివారై యాపదలపాలగుచున్నారు. కొన్ని స్థలములందు

వారి వస్తువులు తస్కరింపఁబడి, గృహములు ద
గ్ధములై, ప్రాణము లపహరింపఁబడి, దేహములు
దహింపఁబడుచున్నవి. యంత్రశాలాధికారులసం
ఖ్య కంటెఁ బనివాండ్రసంఖ్య మిక్కిలి పెద్దది,
కావునఁ బనిచేయువారలే జయమొందఁ గలరు.
వారు జయమొందుట యన, వేతనములు హె
చ్చుట. అవి హెచ్చుట యనఁగా, వస్తువుల మూ
ల్యమధికమగుట. ఏలయన, యజమానుఁడు తా
ననష్టమొందుట కిష్టపడక నష్టమును వస్తువులఁ
గొనువారినుండి రాఁబట్టుకొనుటకుఁ బ్రయత్నిం
చును; ఇంటిపైఁబన్ను వృద్ధిచేయఁబడిన పక్షము
న, నందుఁగాపురముచేయువారిచ్చు సొమ్ము వృ
ద్ధి చేయఁబడును గదా. మఱియు, నాశకు మేర
లేదు. పనివాండ్రిప్పుడు నెలకు పదునయిదు రూ
కలు గావలయునని, కొంతకాలము జనిన పిమ్మట
ముప్పది గావలయునని ఘోషించెదరు. ఇట్లుకల
హములు పెరుగుచుండును. కాని, మనము యం
త్రములను విసర్జించి చేఁతిపనుల నవలంబించినయె
డల నిట్టి, యిక్కట్టులుండవు. ఏలయన, విశాల
మైన దేశమందలి పెక్కుపల్లెలందు దూరముగా
వాసముచేయుచు బట్టలఁ నేయుట మొదలుగాఁ



గల పనులను నిర్వహించుచున్న వారందఱును
నేక కాలంబునఁ దమతమ పనులను మానివేయఁ
గలరని మనమూహింపఁజాలము. కొందఱు మా
నినను, గొందఱయినను బనిసాగించుచునేయుండి,
ప్రజలకు వలసిన పదార్థముల నిచ్చుచునే యుందు
రు. మఱియు, యంత్రములు తక్కువగానున్నప్పు
డు యజమానులకొకింత లాభము చేకూరినను,
యంత్రముల సంఖ్యక్రమముగా వృద్ధియై వాని
లో నన్యోన్యమును బోరాట మతిశయిల్లు చు
న్నందున లాభమును గొందఱు మాత్రమే భాగిం
చి యనుభవించుట కవకాశములేదు. అంతియు
కాదు; అనేకయంత్రశాలాధికారు లొక్క సమ
యంబుననే ధాన్యాదులను బనివాండ్రను గాంక్షిం
చుచుండ, ధాన్యాదుల వెలలు వృద్ధియై పనివాం
డ్రవేతనములుకూడఁ బెరుగును; కావున యంత్ర
నిర్మిత వస్తువులు మిక్కిలి ప్రియమైనవిగానుండి
జనసామాన్యమునకు దుర్లభములగును. మఱియు,
ధనికులు మాత్రమే యంత్రశాలలను స్థాపింపఁగ
లరు; కావున ధనముగలవారికి మాత్రమే యం
త్రములవలన ధనము ప్రాప్తించుఁగాక; లోకము
లో ననేకులు దరిద్రులే కాఁబట్టి వారు యంత్ర

ములను నెలకొల్పఁజాలరు; కావున వారికెట్టి లాభమును గలుగనోపదు; ద్రవ్యములేకున్న, యంత్రములు లేవు; యంత్రములు లేనిచో, ద్రవ్యమును లేదు!

—వ్యక్తిలోపము—

యంత్రములచేఁ జేయఁబడిన వస్తువులు చేతితోఁ జేయఁబడినవానికంటెఁ జౌకగా నుండును గావున లోకులు చేతితోఁ జేయఁబడిన వానిని సంపాదింపరు. అందువలనఁ జేతిపనులను జేయు వారు తమవృత్తిని విసర్జించి జీవనమునకై యంత్రశాలకుఁ బోవలసివచ్చుచున్నది: అచ్చటఁ బ్రవేశించి వారుహృదయ పూర్వకముగాఁ బనిచేయక యజమానుఁడు బాగుపడిన నేమి పాడైననేమి యని యుదాసీనభావముతోఁగాని పాడైనఁజూచి యానందించెదముగాక యని యీర్ష్యతోఁగాని ప్రవర్తించి వాని సొమ్మును దామేయపహరించియు, నితరుల నపహరింపఁజేసియు, నాకస్మికముగాఁ బనిమానియు, వానినిడుములఁబెట్టుచుందురు: వారు పనియందుఁ దమ నైపుణ్యమును జూపరు. లాఘవముతోఁ బనిఁబూర్తి చేయుమార్గముల నాలోచింపరు. క్రొత్తదారులకు దొరకదు. ఎట్లో



కండ్లు మూసికొని యేడ్చుచుఁ బనినీడ్చుచుందురు. కాఁబట్టి యంత్రశాలలందు నియుక్తులయిన వారిపని మొత్తమందును, గుణమందును గూడ హీనమైనదిగా నుండును. అట్లు గాక వస్త్రము నొక్కఁడు తన గృహమున నిర్మించి గ్రామమున దాని విక్రయించినయెడల నాతఁడు వస్త్రనిర్మాణకాలమునఁ బనివాఁడును దాని నమ్ము సమయమున వణిజుఁడునునై యుభయాత్మకుఁడై ద్విగుణితశక్తితోడను మమకారముతోడను, లాభమునకుఁ బాటుపడును. యంత్రశాలలందన్ననో పనివాఁడొకఁడును బనిచేయించు వాఁడొక నొకఁడును నుందురు గానఁ దక్కువ పనిచేసి యెక్కువ వేతనమును గ్రహింపవలెనని పనివాఁడును నెక్కువ పనిజేయించి తక్కువ వేతనము నీయవలయునని యజమానుఁడును నిరంతరమును బ్రయత్నించుచుందురు.

—:సౌందర్య హాని:—

కొందఱుమనూష్యులు పాశ్చాత్యులననుకరించి భూమి నిదున్నుటకుఁ గూడ యంత్రములను బ్రయోగించి ప్రకృతియొక్క సౌందర్యమును నైర్మల్యమును ధ్వంసము చేయుచున్నారు. కోకిలావికూజితములతో నొప్పు తరుగుల్మలతాదుల మధ్యను, నిర్మ

రారావములతోఁ దనరు పర్వత ప్రాంతములందును, కల్హారాది శోభితంబులైన కాసారముల సమీపమునను, యంత్రములయందము నేమని వర్ణింపవచ్చును? అవిదృష్టి బొమ్మలుగా నుండుట కైనను బనికిరావు. అయ్యవి మిక్కిలి దుర్భగములగుటయేగాక, సుందరములైన విషయముల సౌభాగ్యమునకుఁగూడఁ గీడు దెచ్చును. యంత్రములను జూచి పశువులు సైతము మోహము నొందవు. అతీంద్రియ జ్ఞాన సంపన్నులైన మన ఋషులు వెఱ్ఱివారు కారు; వారు యంత్రములవలన లోకమునకు క్షేమము కలుగునని తలంచి రేని, నానా విధ యంత్రములను నిర్మించి భరతఖండ మంతయును యంత్రములతోఁ గట్టి వైచి యుందురు. కాని వారట్లు చేయలేదు గావున యంత్రములనర్థావహములని సరసు లూహింపఁ గలరు.

—రుచి మున్నగు గుణములు—

యంత్రములవలనఁ జేయఁబడిన భోజన పదార్థములు సామాన్యముగా రుచిగలిగియుండవు. రోకలితోఁ దంచిన బియ్యమునకును యంత్రములవలన లభించిన వానికిని భేదమును బశువులుకూడ గ్రహింపఁగలవు. "గావో ఘ్రాణేన పశ్యంతి" అనువాక్య



ముచొప్పున గోవులు మొదలయిన జంతువులు వాసనచూచి యంత్రమునందలి బియ్యమును విసర్జించును. మొదట మానవుఁడు కూడ నట్లు చేయును. అది స్వభావసిద్ధము. కాని తరువాత నాతఁడు కృత్రిమబుద్ధి నవలంబించి యభక్ష్య భక్షణాద్యస్వాభావిక ప్రవర్తనకుఁ గడంగును. అంతటితో నాతఁడు సంతృప్తిఁ జెందియుండఁడు. నిర్మలహృదయములతో మెలంగుచు నైసర్గిక మార్గమునఁ బోవుచున్న పశుపక్ష్యాదులకుఁ గూడ నతఁడు తన విపరీత చేష్టలనే గఱపుచుండును. అట్లు మానుషబుద్ధి దూషితములై యవి ప్రకృతికి విరుద్ధములైన పథములంబట్టుట చూపట్టుచున్నది. కావున యంత్రములచే సంపాదింపఁబడిన చిట్టుమున్నగు పదార్థములను గోవులు, మొదలయినజంతువులు భక్షించుటకుఁ బ్రారంభించినను, నట్టి పదార్థములు యంత్రదుష్టములుగావని చెప్పుటకువీలులేదు.

అవి యారోగ్యమునకుఁ గూడ హానిఁ గలుగఁ జేయును. ఒకఁడు యంత్రమువలన వచ్చిన బియ్యమును దినుచున్నాఁడు. రెండవవాఁడు తత్సహాయములేకయే ప్రాప్తించిన బియ్యమునుదినుచున్నాఁడు. వీరిలో రెండవవానికంటె మొదటివాఁడే

వేగముగా రోగమును బొందుచున్నాఁడు. రోగము వచ్చినచో రెండవవాఁడే సులభముగాఁ దనయారోగ్యమును, మరలసంపాదించుకొనఁగలఁడు. పాకభేదముచేత గుణభేదము. మిక్కిలి మెత్తగా దంచఁబడిన యన్నమునకొక గుణము, బిరుసుగా దంచఁబడిన దానికి మఱియొకటి. కావున యంత్రములవే. తాకిన బియ్యమనారోగ్యమునకుఁ గారణమగును. అవి బలమునకుఁ గూడ నష్టముఁ గలుగఁజేయును. బియ్యముమీఁదనొకపొరయుండును. అందుఁ బ్రాణమునకు బలము కలిగించు పదార్థమొకటి యుండును. అది తవుడుతోఁగూడ బియ్యమునుండి యంత్రముచే విడఁదీయఁబడుచున్నది. కావున నట్టిబియ్యము ప్రాణమునకంతమేలుచేయవు. యంత్రములను విసర్జించిన మొదలవన కావశ్యకమయినంతవఱకే ధాన్యమును దంచి బియ్యముచేసికొని బలమును సంపాదింపఁగలము యంత్రములను విడనాడలేనివారు బియ్యమునుండి వేఱుచేయఁబడినపొట్టునుగూడఁ గొంతభక్షించుచుండవలెను. మఱియుఁ, బాత్రముబట్టి రుచియున్నగుణములుండును. ఇత్తడిగిన్నెలో వండఁబడిన యన్నముకంటె మట్టికుండల్లో వండఁబడినది రసవం

